అగస్త్య మహర్షి శ్రీరామచంద్రునకు ఉపదేశించినది
సకలకార్యసిద్ధిని, ఆయురారోగ్యవృద్ధిని కలిగించునది

# ఆదిత్యహృదయము

## ప్రతిపదార్థతాత్పర్య సహితము



వ్యాఖ్యాత:

## గుహభట్టారకుడు

BPMD Publications

Aditya Hrudayamu

By Guhabhattarakudu



Cover Design: Ambarambara Arts

Publishers:

BPMD Publications

Hyderabad

**Email:** bpmdpublications@gmail.com

# వ్యాఖ్యాత వచనము

పరమపావనమైనది, వాల్మీకిమహర్షికృతమైనది, దేవమునిగణముల మొదలు పామరజనసందోహముల వరకూ అందరూ పారాయణచేసి తరించగలిగినది అయిన పుణ్యచరితము శ్రీమద్రామాయణము.

౨౪ వేల శ్లోకములు కలిగిన ఈ మహేతిహాసము ౨౪ అక్షరముల సాక్షాత్ గాయత్రీమహామంత్ర స్వరూపమని మహర్షుల ఉవాచ.

ఈ కావ్యమునందలి ప్రతి కాండ, ప్రతి సర్గ, ప్రతి శ్లోకమూ పరమపవిత్రమైనవి. సాధకులకు ఇహపర ఫలితములను ఇచ్చునవి.

అందు యుద్ధకాండనందలి ౧౦౫వ సర్గ మరింత పవిత్రతను ఆపాదించుకొన్నది. సాక్షాత్ శ్రీమన్నారాయణుడైన శ్రీరామచంద్ర ప్రభువు రావణునితో సంగ్రామము సలుపుతూ అలసి ఉన్నప్పుడు, మహాత్ముడు, అన్ని లోకములవారికీ ప్రాతఃస్మరణీయుడు, భగవత్స్వరూపుడు అయిన అగస్త్యమహర్షి ఆ యుద్ధక్షేత్రమునకు అరుదెంచి శ్రీరామచంద్రమూర్తికి జయము కలుగుటకై ఉపదేశించిన మహోన్నత స్తోత్రరాజమే ఈ “ఆదిత్యహృదయము”.

అగస్త్యమహర్షి అనుగ్రహించిన ఆ స్తోత్రమును వారి ఉపదేశానుసారము ముమ్మారు పఠించి ప్రత్యక్షనారాయణుడైన ఆ సూర్యభగవానుణ్ణి ఆరాధించి ఆ దేవదేవుని అనుగ్రహంతో రావణసంహారము చేసి లోకకల్యాణమొనర్చినాడా జానకీపతి.

అట్టి మహత్తు కలిగిన ఈ దివ్య స్తోత్రమును ప్రతిపదార్థ, తాత్పర్య సహితముగా భక్తజనులకు అందజేయ సంకల్పమునకు నా స్వామి శ్రీరాముని అనుజ్ఞయైనది.

సకలభయవినాశిని, ధవళకీర్తి ప్రదాయిని, సర్వకార్యార్థసిద్ధికరి, ఆయురారోగ్యైశ్వర్యప్రదాయిని, బ్రహ్మానందకారిణి అయిన ఈ ఆదిత్యహృదయమును అనుదినం ముమ్మారు పఠించి సర్వులునూ శుభములను బడయగలరని ఆశిస్తూ ఆ లోకోత్తర మహాపురుషుడైన శ్రీరామచంద్రమూర్తిని, కనులముందు కదలాడే లోకారాధ్యుడు సూర్యభగవానుని మనసా స్మరిస్తూ స్వస్తి!

శ్రీరామచన్ద్రపరబ్రహ్మణే నమః

– గుహభట్టారకుడు

# ఆదిత్యహృదయ స్తోత్రము

తతో యుద్ధపరిశ్రాన్తం సమరే చిన్తయా స్థితమ్
రావణం చాగ్రతో దృష్ట్వా యుద్ధాయ సముపస్థితమ్ ౧

దైవతైశ్చ సమాగమ్య ద్రష్టుమభ్యాగతో రణమ్,
ఉపాగమ్యాబ్రవీద్రామమగస్త్యో భగవాన్ ఋషిః ౨

రామ రామ మహాబాహో శృణు గుహ్యం సనాతనమ్
యేన సర్వానరీన్వత్స సమరే విజయిష్యసే ౩

ఆదిత్యహృదయం పుణ్యం సర్వశత్రువినాశనమ్
జయావహం జపేన్నిత్యమక్షయ్యం పరమం శివమ్ ౪

సర్వమఙ్గలమఙ్గల్యం సర్వపాపప్రణాశనమ్,
చిన్తాశోకప్రశమనమాయుర్వర్ధనముత్తమమ్ ౫

రశ్మిమన్తం సముద్యన్తం దేవాసురనమస్కృతమ్
పూజయస్వ వివస్వన్తం భాస్కరం భువనేశ్వరమ్ ౬

సర్వదేవాత్మకో హ్యేష తేజస్వీ రశ్మిభావనః
ఏష దేవాసురగణాన్ లోకాన్ పాతి గభస్తిభిః ౭

ఏష బ్రహ్మాచ విష్ణుశ్చ శివః స్కన్దః ప్రజాపతిః
మహేన్ద్రో ధనదః కాలో యమః సోమో హ్యాపాంపతిః ౮

పితరో వసవః సాధ్యా అశ్వినౌ మరుతో మనుః
వాయుర్వహ్నిః ప్రజాః ప్రాణా ఋతుకర్తా ప్రభాకరః ౯

ఆదిత్యః సవితా సూర్యః ఖగః పూషా గభస్తిమాన్
సువర్ణసదృశో భానుర్హిరణ్యరేతా దివాకరః ౧౦

హరిదశ్వః సహస్రార్చిః సప్తసప్తిర్మరీచిమాన్
తిమిరోన్మథనః శమ్భుస్త్వష్టా మార్తణ్డకోంశుమాన్ ౧౧

హిరణ్యగర్భః శిశిరస్తపనోऽహస్కరో రవిః
అగ్నిగర్భోऽదితేః పుత్రః శఙ్ఖః శిశిరనాశనః ౧౨

వ్యోమనాథస్తమోభేదీ ఋగ్యజుఃసామపారగః
ఘనవృష్టిరపాం మిత్రో విన్ధ్యవీథీప్లవంగమః ౧౩

ఆతపీ మణ్డలీ మృత్యుః పిఙ్గలః సర్వతాపనః,
కవిర్విశ్వో మహాతేజా రక్తః సర్వభవోద్భవః ౧౪

నక్షత్రగ్రహతారాణామధిపో విశ్వభావనః
తేజసామపి తేజస్వీ ద్వాదశాత్మన్నమోऽస్తు తే ౧౫

నమః పూర్వాయ గిరయే పశ్చిమాయాద్రయే నమః
జ్యోతిర్గణానాం పతయే దినాధిపతయే నమః ౧౬

జయాయ జయభద్రాయ హర్యశ్వాయ నమో నమః,
నమో నమః సహస్రాంశో ఆదిత్యాయ నమో నమః ౧౭

నమ ఉగ్రాయ వీరాయ సారఙ్గాయ నమో నమః,
నమః పద్మప్రబోధాయ ప్రచణ్డాయ నమో నమః ౧౮

బ్రహ్మేశానాచ్యుతేశాయ సూర్యాయాదిత్యవర్చసే
భాస్వతే సర్వభక్షాయ రౌద్రాయ వపుషే నమః ౧౯

తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నాయామితాత్మనే
కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాం పతయే నమః ౨౦

తప్తచామీకరాభాయ హరయే విశ్వకర్మణే
నమస్తమోభినిఘ్నాయ రుచయే లోకసాక్షిణే ౨౧

నాశయత్యేష వై భూతం తదేవ సృజతి ప్రభుః
పాయత్యేష తపత్యేష వర్షత్యేష గభస్తిభిః ౨౨

ఏష సుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః
ఏష చైవాగ్నిహోత్రం చ ఫలం చైవాగ్నిహోత్రిణామ్ ౨౩

దేవాశ్చ క్రతవశ్చైవ క్రతూనాం ఫలమేవ చ
యాని కృత్యాని లోకేషు సర్వేషు పరమప్రభుః ౨౪

ఏనమాపత్సు కృచ్ఛ్రేషు కాన్తారేషు భయేషు చ
కీర్తయన్ పురుషః కశ్చిన్నావసీదతి రాఘవ ౨౫

పూజయస్వైనమేకాగ్రో దేవదేవం జగత్పతిమ్
ఏతత్త్రిగుణితం జప్త్వా యుద్ధేషు విజయిష్యసి ౨౬

అస్మిన్ క్షణే మహాబాహో రావణం త్వం వధిష్యసి
ఏవముక్త్వా తతోఽగస్త్యో జగామ స యథాగతమ్ ౨౭

ఏతచ్ఛ్రుత్వా మహాతేజా నష్టశోకోఽభవత్తదా
ధారయామాస సుప్రీతో రాఘవః ప్రయతాత్మవాన్ ౨౮

ఆదిత్యం ప్రేక్ష్య జప్త్వా తు పరం హర్షమవాప్తవాన్
త్రిరాచమ్య శుచిర్భూత్వా ధనురాదాయ వీర్యవాన్ ౨౯

రావణం ప్రేక్ష్య హృష్టాత్మా యుద్ధార్థం సముపాగమత్
సర్వయత్నేన మహతా వధే తస్య ధృతోఽభవత్ ౩౦

అథ రవిరవదన్నిరీక్ష్య రామం
ముదితమనాః పరమం ప్రహృష్యమాణః
నిశిచరపతిసంక్షయం విదిత్వా
సురగణమధ్యగతో వచస్త్వరేతి ౩౧

మూలశ్లోకము – సంస్కృతాంధ్ర లిపులలో,
ప్రతిపదార్థతాత్పర్యములు తెలుగులో...

# ఆదిత్యహృదయము

ततो युद्धपरिश्रान्तं समरे चिन्तया स्थितम्
रावणं चाग्रतो दृष्ट्वा युद्धाय समुपस्थितम्

दैवतैश्च समागम्य द्रष्टुमभ्यागतो रणम्
उपगम्याब्रवीद्राममगस्त्यो भगवान् ऋषिः

తతో యుద్ధపరిశ్రాన్తం సమరే చిన్తయా స్థితమ్
రావణం చాగ్రతో దృష్ట్వా యుద్ధాయ సముపస్థితమ్ ౧

దైవతైశ్చ సమాగమ్య ద్రష్టుమభ్యాగతో రణమ్,
ఉపాగమ్యాబ్రవీద్రామమగస్త్యో భగవాన్ ఋషిః ౨

**ప్రతిపదార్థము:**

తతః= ఆ తరువాత,

దైవతః= దేవతలతో,

సమాగమ్య= కలిసి,

రణమ్= రణమును,

ద్రష్టుమ్= చూడడానికి,

అభ్యాగతః= వచ్చినటువంటి,

భగవాన్= భగవానుడైన,

అగస్త్యః= అగస్త్యమహర్షి,

యుద్ధపరిశ్రాన్తమ్= యుద్ధమునందు అలసట పొందిన,

యుద్ధాయ= యుద్ధము కొరకు,

సముపస్థితమ్= వచ్చి ఉన్నటువంటి,

రావణమ్= రావణుణ్ణి,

అగ్రతః= ఎదుట,

దృష్ట్వా= చూచి,

సమరే= సమరమునందు,

చిన్తయా= చింతాక్రాంతుడై,

స్థితమ్= ఉన్న,

రామమ్= రాముని,

ఉపగమ్య= సమీపించి,

అబ్రవీత్= పలికెను.

**తాత్పర్యము:**

రామరావణ యుద్ధమును చూచుటకై దేవతలతో కలిసి వచ్చిన భగవానుడైన అగస్త్యమహర్షి, యుద్ధరంగమున నిలబడిన రావణుని

చూచి ఆ తరువాత యుద్ధములో అలసి, చింతాక్రాంతుడై ఉన్న శ్రీరాముని దగ్గరకు వెళ్లి ఇలా పలికెను.

राम राम महाबाहो शृणु गुह्यं सनातनम्
येन सर्वानरीन्वत्स समरे विजयिष्यसे

రామ రామ మహాబాహో శృణు గుహ్యం సనాతనమ్
యేన సర్వానరీన్వత్స సమరే విజయిష్యసే 3

**ప్రతిపదార్థము:**

మహాబాహో= గొప్పవైన బాహువులు గల,

రామ రామ= ఓ రామా! రామా!

సనాతనమ్= నిత్యమైన,

గుహ్యమ్= రహస్యమును,

శృణు= వినుము,

వత్స= నాయనా,

యేన= దేనిచేత,

సమరే= రణమునందు,

సర్వాన్= సమస్తమైనటువంటి,

అరీన్= శత్రువులను,

విజయిష్యసే= జయించగలవో!

**తాత్పర్యము:**

నాయనా! మహాబాహూ! శ్రీరామా! నిత్యమైనదిను, రహస్యమైనదిను, దేనిచేత యుద్ధములో సమస్తశత్రువులనూ జయించగలవో అటువంటి స్తోత్రమును వినుము.

आदित्यहृदयं पुण्यं सर्वशत्रुविनाशनम्
जयावहं जपेन्नित्यमक्षय्यं परमं शिवम्

सर्वमङ्गलमङ्गल्यं सर्वपापप्रणाशनम्
चिन्ताशोकप्रशमनमायुर्वर्धनमुत्तमम्

ఆదిత్యహృదయం పుణ్యం సర్వశత్రువినాశనమ్
జయావహం జపేన్నిత్యమక్షయ్యం పరమం శివమ్ ౪

సర్వమఙ్గలమఙ్గల్యం సర్వపాపప్రణాశనమ్,
చిన్తాశోకప్రశమనమాయుర్వర్ధనముత్తమమ్ ౫

**ప్రతిపదార్థము:**

పుణ్యమ్= పుణ్యప్రదమైనది,

సర్వశత్రువినాశనమ్= సర్వశత్రు నాశకమైనది,

జయావహమ్= జయమును కలిగించునది,

అక్షయ్యమ్= క్షయము లేని ఫలమును ఇచ్చునది,

పరమం శివమ్= మిక్కిలి పావనమైనది,

సర్వమఙ్గలమఙ్గల్యం= మంగళకరములన్నింటిలోను మంగళకరమైనది,

సర్వపాపప్రణాశనమ్= సకల పాపములను విశేషముగా నశింపజేయునది,

చిన్తాశోకప్రశమనమ్= చింతను, శోకమును శాంతిపజేయునది,

ఉత్తమమ్= ఉత్తమమైనది,

అయుర్వర్ధనమ్= ఆయువునును వృద్ధి పొందించునది అయిన,

ఆదిత్యహృదయమ్= ఆదిత్యహృదయమను స్తోత్రమును,

నిత్యమ్= ఎల్లప్పుడూ,

జపేత్= జపించవలెను.

**తాత్పర్యము:**

పుణ్యప్రదమైనది, సర్వశత్రునాశకమైనది, అత్యంత మంగళకరమైనది, అక్షయమైన ఫలమునిచ్చునది, జయమును కలిగించునది, సకలపాపవినాశిని, ఉత్తమమైనది, పవిత్రమైనది, దుఃఖమును తొలగించునది, ఆయువును వృద్ధిచేయునది అయిన ఆదిత్యహృదయ స్తోత్రమును నిత్యమూ జపించవలెను.

रश्मिमन्तं समुद्यन्तं देवासुरनमस्कृतम्
पूजयस्व विवस्वन्तं भास्करं भुवनेश्वरम्

రశ్మిమన్తం సముద్యన్తం దేవాసురనమస్కృతమ్
పూజయస్వ వివస్వన్తం భాస్కరం భువనేశ్వరమ్ ౬

**ప్రతిపదార్థము:**

రశ్మిమన్తమ్= శ్రేష్ఠమైన కిరణములు కలవాడు,

సముద్యన్తమ్= ఉదయించుచున్నవాడు,

దేవాసురనమస్కృతమ్= దేవరాక్షస గణముల చేత నమస్కరించబడిన వాడు,

వివస్వన్తమ్= ఇతర తేజస్సులను కప్పివేయువాడు,

భాస్కరమ్= కాంతినిచ్చువాడు,

భువనేశ్వరమ్= భువనములకు నియామకుడు అయిన సూర్యుని,

పూజయస్వ= పూజింపుము.

**తాత్పర్యము:**

భాస్కరుడు శ్రేష్ఠమైన కిరణములు గలవాడు, ఉదయపర్వతమునందు ఉదయించువాడు, దేవదానవులచేత నమస్కరింపబడిన వాడు, తన తేజస్సుచే ఇతర తేజస్సులను కప్పివేయువాడు, కాంతిని ఇచ్చువాడు.

సకల భువనములను నియమించువాడు. అట్టి సూర్యభగవానుని ఆరాధింపుము.

**ఈ శ్లోకమునందలి మంత్రములు:**

౧. రశ్మిమతే నమః

౨. సముద్యతే నమః

౩. దేవాసురనమస్కృతాయ నమః

౪. వివస్వతే నమః

౫. భాస్కరాయ నమః

౬. భువనేశ్వరాయ నమః

सर्वदेवात्मको ह्येष तेजस्वी रश्मिभावनः
एष देवासुरगणान् लोकान् पाति गभस्तिभिः

సర్వదేవాత్మకో హ్యేష తేజస్వీ రశ్మిభావనః
ఏష దేవాసురగణాన్ లోకాన్ పాతి గభస్తిభిః ౭

**ప్రతిపదార్థము:**

ఏషః= ఇతడు,

సర్వదేవాత్మకః= సకల దేవతాస్వరూపుడు,

తేజస్వీ= గొప్పదైన తేజస్సు కలవాడు,

రశ్మిభావనః= తన కిరణముల చేత అందరనూ రక్షించువాడు,

ఏషః= ఇతడు,

గభస్తిభిః= కిరణముల చేత,

దేవాసురగణాన్= దేవాసురగణములను,

లోకాన్= లోకములను,

పాతి= రక్షించును.

**తాత్పర్యము:**

సర్వదేవతా స్వరూపుడు, గొప్ప తేజస్సు కలవాడు అయిన ఈ సూర్యుడు తన కిరణముల చేత దేవాసురగణములను, లోకములను రక్షించుచున్నాడు.

**ఈ శ్లోకమునందలి మంత్రములు:**

౧. సర్వదేవాత్మకాయ నమః

౨. తేజస్వినే నమః

౩. రశ్మిభావనాయ నమః

౪. దేవాసురగణలోకపాలాయ నమః

एष ब्रह्मा च विष्णुश्च शिवः स्कन्दः प्रजापतिः
महेन्द्रो धनदः कालो यमः सोमो ह्यपांपतिः

ఏష బ్రహ్మ చ విష్ణుశ్చ శివః స్కన్దః ప్రజాపతిః
మహేన్ద్రో ధనదః కాలో యమః సోమో హ్యపాంపతిః ౮

**ప్రతిపదార్థము:**

ఏషః= ఇతడు,

బ్రహ్మే చ= బ్రహ్మదేవుడు,

విష్ణుశ్చ= విష్ణువు,

శివః= శివుడు,

స్కన్దః= కుమారస్వామి,

ప్రజాపతిః= ప్రజాపతి,

మహేన్ద్రః= మహేంద్రుడు,

ధనదః= కుబేరుడు,

కాలః= కాలపురుషుడు,

యమః= యముడు,

సోమః= చంద్రుడు,

అంపాపతిః= జలమునకు అధిదేవతయైన వరుణుడు.

**తాత్పర్యము:**

ఈ సూర్యుడే బ్రహ్మ, విష్ణువు, శివుడు, కుమారస్వామి, నవప్రజాపతులు, కుబేరుడు, కాలపురుషుడు, యముడు, చంద్రుడు, వరుణుడు.

**ఈ శ్లోకమునందలి మంత్రములు:**

౧. బ్రహ్మణే నమః

౨. విష్ణవే నమః

౩. శివాయ నమః

౪. స్కన్దాయ నమః

౫. ప్రజాపతయే నమః

౬. మహేన్ద్రాయ నమః

౭. ధనదాయ నమః

౮. కాలాయ నమః

౯. యమాయ నమః

౧౦. సోమాయ నమః

౧౧. అపాంపతయే నమః

पितरो वसवः साध्या अश्विनौ मरुतो मनुः
वायुर्वह्निः प्रजाः प्राण ऋतुकर्ता प्रभाकरः

పితరో వసవః సాధ్యా అశ్వినౌ మరుతో మనుః
వాయుర్వహ్నిః ప్రజాః ప్రాణ ఋతుకర్తా ప్రభాకరః ౯

**ప్రతిపదార్థము:**

పితరః= పితృదేవతలు,

వసవః= అష్టవసువులు,

సాధ్యాః= సాధ్యులు,

అశ్వినౌ= అశ్వినీదేవతలు,

మరుతః= మరుత్తులు,

మనుః= మనువు,

వాయుః= వాయువు,

వహ్నిః= అగ్ని,

ప్రజాః= ప్రజలు,

ప్రాణః= ప్రాణవాయువు,

ఋతుకర్తా= ఋతువులను ఏర్పరచువాడు,

ప్రభాకరః= కాంతినిచ్చువాడు

తాత్పర్యము:

పితృదేవతలు, అష్టవసువులు, సాధ్యులు, అశ్వినీదేవతలు, నలభైతొమ్మిదిమంది మరుత్తులు, మనువు, వాయువు, అగ్ని, జనులు, ప్రాణవాయువు వీటన్నిటిరూపంలో ఉన్నవాడు సూర్యుడే. ఆయనవలననే ఋతువులు ఏర్పడును, కాంతి ప్రసరించును.

**ఈ శ్లోకమునందలి మంత్రములు:**

౧. పితృదేవతాయై నమః

౨. వసుమూర్తయే నమః

౩. సాధ్యమూర్తయే నమః

౪. అశ్వీమూర్తయే నమః

౫. మరున్మూర్తయే నమః

౬. మనవే నమః

౭. వాయుమూర్తయే నమః

౮. వహ్నయే నమః

౯. ప్రజారూపాయ నమః

౧౦. ప్రాణాయ నమః

౧౧. ఋతుకర్త్రే నమః

౧౨. ప్రభాకరాయ నమః

आदित्यः सविता सूर्यः खगः पूषा गभस्तिमान्
सुवर्णसदृशो भानुर्हिरण्यरेता दिवाकरः

ఆదిత్యః సవితా సూర్యః ఖగః పూషా గభస్తిమాన్

సువర్ణసదృశో భానుర్హిరణ్యరేతా దివాకరః ౧౦

**ప్రతిపదార్థము:**

ఆదిత్యః= అదితి కుమారుడు,

సవితా= జగత్ కర్త,

సూర్యః= జనులను కర్మలయందు ప్రేరేపించువాడు,

ఖగః= ఆకాశ సంచారము చేయువాడు,

పూషా= జగత్తును వర్షము చేత పోషించువాడు,

గభస్తిమాన్= కిరణములు కలవాడు,

సువర్ణసదృశః= కాంచన వర్ణము కలవాడు,

భానుః= ప్రకాశించువాడు,

హిరణ్యరేతాః= బంగారము రేతస్సుగా గలవాడు,

దివాకరః= పగలుకు కారకుడు

**తాత్పర్యము:**

దేవమాత అదితి కుమారుడును, ఈ జగత్తును సృష్టించినవాడును, లోకులను తమతమ పనులయందు ప్రేరేపించువాడును, ఆకాశసంచారిను, వర్షములచేత ఈ భువనములను పోషించువాడును, కిరణకరుడును, బంగారువర్ణములో ప్రకాశించువాడును, కాంచనము రేతస్సుగా కలవాడును, పగలును కల్పించువాడును అయిన దేవేశ్వరుడీ సూర్యభగవానుడు.

**ఈ శ్లోకమునందలి మంత్రములు:**

౧. ఆదిత్యాయ నమః

౨. సవిత్రే నమః

౩. సూర్యాయ నమః

౪. ఖగాయ నమః

౫. పూష్ణే నమః

౬. గభస్తిమతే నమః

౭. సువర్ణసదృశాయ నమః

౮. భానవే నమః

౯. హిరణ్యరేతసే నమః

౧౦. దివాకరాయ నమః

हरिदश्वः सहस्रार्चिः सप्तसप्तिर्मरीचिमान्
तिमिरोन्मथनः शम्भुस्त्वष्टा मार्तण्डकोऽंशुमान्

హరిదశ్వః సహస్రార్చిః సప్తసప్తిర్మరీచిమాన్
తిమిరోన్మథనః శమ్భుస్త్వష్టా మార్తణ్డకోంశుమాన్ ౧౧

**ప్రతిపదార్థము:**

హరిదశ్వః= ఆకుపచ్చని గుర్రములు కలవాడు,

సహస్రార్చిః= సహస్ర మయూఖములు (కిరణములు) గలవాడు,

సప్తసప్తిః= ఏడు గుఱ్ఱములు గలవాడు,

మరీచిమాన్= కిరణములు గలవాడు,

తిమిరోన్మథనః= తిమిరమును అనగా చీకటిని నశింపజేయువాడు,

శమ్భుః= సుఖమునకు ఉత్పత్తిస్థానమైనవాడు,

త్వష్టా= అన్ని రూపములను చెక్కువాడు ఆపై కృశింపజేయువాడు,

మార్తణ్డకః= బ్రహ్మాండము అంతమైన తదుపరి మరల దానిని సృష్టించుటకై ఆవిర్భవించినవాడు,

అంశుమాన్= కిరణములు కలవాడు.

**తాత్పర్యము:**

ఈ సూర్యుడు ఆకుపచ్చని వర్ణము కలిగిన ఏడు గుఱ్ఱములు కలవాడు, సహస్ర కిరణములు (అనంత కిరణములు) కలిగి, చీకటిని నశింపజేయువాడు. సుఖమును ఇచ్చువాడు. సంహారకర్త. జగత్తును ప్రళయానంతరము మరల సృజించువాడు.

**ఈ శ్లోకమునందలి మంత్రములు:**

౧. హరిదశ్వాయ నమః

౨. సహస్రార్చిషే నమః

౩. సప్తసప్తయే నమః

౪. మరీచిమతే నమః

౫. తిమిరోన్మథనాయ నమః

౬. శంభవే నమః

౭. త్వష్ట్రే నమః

౮. మార్తణ్డకాయ నమః

౯. అంశుమతయే నమః

हिरण्यगर्भः शिशिरस्तपनोऽहस्करो रविः
अग्निगर्भोऽदितेः पुत्रः शङ्खः शिशिरनाशनः

హిరణ్యగర్భః శిశిరస్తపనోఽహస్కరో రవిః
అగ్నిగర్భోఽదితేః పుత్రః శఙ్ఖః శిశిరనాశనః ౧౨

**ప్రతిపదార్థము:**

హిరణ్యగర్భః= సృష్టిస్థితిలయకర్తలైన బ్రహ్మవిష్ణుమహేశ్వరస్వరూపుడు,

శిశిరః= తాప నాశనము చేయు చల్లనివాడు,

తపనః= వేడి కలిగించువాడు,

అహస్కరః= పగటిని కలిగించువాడు,

రవిః= అందరిచేత స్తుతింపబడువాడు,

అగ్నిగర్భః= అగ్ని గర్భమునందు గలవాడు,

అదితేః= అదితి యొక్క,

పుత్ర= పుత్రుడు,

శఙ్ఖః= స్వయముగ శాంతించువాడు(సాయంకాలమున శాంతమును పొందువాడు),

శిశిరనాశనః= మంచును నశింపజేయువాడు.

**తాత్పర్యము:**

సూర్యుడు బ్రహ్మవిష్ణుమహేశ్వర స్వరూపుడు. తాపములు తొలగించు చల్లనివాడు, సర్వాధారమైన వేడి కలిగించువాడు, పగటికి కారకుడు, సర్వులచేత స్తుతింపబడువాడు, అగ్ని గర్భమునందు గలవాడు, అదితి కుమారుడు, సాయంకాలమునందు శాంతించువాడు, శిశిరమును నశింపజేయువాడు.

**ఈ శ్లోకమునందలి మంత్రములు:**

౧. హిరణ్యగర్భాయ నమః

౨. శిశిరాయ నమః

౩. తపనాయ నమః

౪. అహస్కరాయ నమః

౫. రవయే నమః

౬. అగ్నిగర్భాయ నమః

౭. అదితేః పుత్రాయ నమః

౮. శఙ్ఖాయ నమః

౯. శిశిరనాశనాయ నమః

व्योमनाथस्तमोभेदी बुग्यजुःसामपारगः
घनवृष्टिरपां मित्रो विन्ध्यवीथीप्लवंगमः

వ్యోమనాథస్తమోభేదీ ఋగ్యజుఃసామపారగః
ఘనవృష్టిరపాం మిత్రో విన్ధ్యవీథీప్లవంగమః ౧3

**ప్రతిపదార్థము:**

వ్యోమనాథః= ఆకాశమునకు అధిపతి,

తమోభేదీ= రాహువును భేదించువాడు,

ఋగ్యజుఃసామపారగః= ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదముల పారమును పొందినవాడు,

ఘనవృష్టిః= అధికమైన వర్షము గలవాడు,

అపామ్= జలములకు,

మిత్రః= మిత్రుడు,

విన్ధ్యవీథీప్లవంగమః= ఆకాశమార్గమునందు శీఘ్రగతిని వెళ్లువాడు.

**తాత్పర్యము:**

సూర్యుడు అనంతాకాశమునకు అధినాయకుడు, రాహువును భేదించువాడు. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదముల పారమును పొందినవాడు, అధికమైన వర్షమును ఇచ్చువాడు, జలమునకు మిత్రుడు, గగనమున శీఘ్రముగా సంచరించువాడు.

**ఈ శ్లోకమునందలి మంత్రములు:**

౧. వ్యోమనాథాయ నమః

౨. తమోభేదినే నమః

౩. ఋగ్యజుఃసామపారగాయ నమః

౪. ఘనవృష్టయే నమః

౫. అపాంమిత్రాయ నమః

౬. విన్ధ్యవీథీప్లవంగమాయ నమః

आतपी मण्डली मृत्युः पिङ्गलः सर्वतापनः
कविर्विश्वो महातेजा रक्तः सर्वभवोद्भवः

ఆతపీ మణ్డలీ మృత్యుః పిఙ్గలః సర్వతాపనః,

కవిర్విశ్వో మహాతేజా రక్తః సర్వభవోద్భవః ౧౪

**ప్రతిపదార్థము:**

ఆతపీ= ఎండనిచ్చువాడు,

మణ్డలీ= మండలము గలవాడు,

మృత్యుః= శత్రువులకు మృత్యువైనవాడు,

పిఙ్గలః= ఎఱ్ఱని రంగు గలవాడు,

సర్వతాపనః= సర్వులను, సర్వమును తపింపజేయువాడు,

కవిః= పండితుడు,

విశ్వః= ప్రపంచమును నడుపువాడు,

మహాతేజాః= గొప్ప తేజస్సుగలవాడు,

రక్తః= జగత్తునందు అనురాగము గలవాడు,

సర్వభవోద్భవః= సర్వ సంసారమునకు ఉత్పత్తి స్థానమైనవాడు.

**తాత్పర్యము:**

సూర్యుడు ఎండ ఇచ్చువాడు. సూర్య మండలమునందుండు వాడు. శత్రుసంహారకుడు. ఉదయ కాలమున ఎఱ్ఱని వర్ణములో నుండువాడు. లోకములకు తాపము కలిగించువాడు. పండితుడు. విశ్వ వ్యవహారకర్త. గొప్ప తేజస్సు గలవాడు. ప్రేమమయుడు. ఈ ప్రపంచమునకు కారణభూతుడు.

**ఈ శ్లోకమునందలి మంత్రములు:**

౧. ఆతపినే నమః

౨. మణ్డలినే నమః

౩. మృత్యవే నమః

౪. పిఙ్గలాయ నమః

౫. సర్వతాపనాయ నమః

౬. కవయే నమః

౭. విశ్వస్మై నమః

౮. మహాతేజసే నమః

౯. రక్తాయ నమః

౧౦. సర్వభవోద్భవాయ నమః

नक्षत्रग्रहताराणामधिपो विश्वभावनः

तेजसामपि तेजस्वी द्वादशात्मन्नमो.स्तु ते

నక్షత్రగ్రహతారాణామధిపో విశ్వభావనః

తేజసామపి తేజస్వీ ద్వాదశాత్మన్నమో஽స్తు తే ౧౫

**ప్రతిపదార్థము:**

నక్షత్రగ్రహతారాణామ్= నక్షత్రములకు, గ్రహములకు, తారలకు

అధిపః= అధిపతి,

విశ్వభావనః=విశ్వమును సృజించినవాడు,

తేజసామపి= సమస్త తేజస్సులలో కూడా,

తేజస్వీ= అధికమైన తేజస్సు కలవాడు,

ద్వాదశాత్మాన్= పన్నెండు రూపములు గలవాడా,

తే= నీకు,

నమః= నమస్కారము,

అస్తు= అగుగాక.

**సూర్యుని పన్నెండు రూపములు:**

"ఇన్ద్రో ధాతా భగః పూషా మిత్రోఽథ వరుణోఽర్యమా

అర్చిర్వివస్వాన్ త్వష్టా చ సవితా విష్ణురేవ చ"

**తాత్పర్యము:**

నక్షత్రగ్రహతారాధిపతీ, జగత్కర్తా, సమస్త తేజస్సులలోకెల్లా అధికమైన తేజస్సు కలవాడా, ఓ ద్వాదశ స్వరూపా, సూర్యదేవా నీకు నమస్కారము.

**ఈ శ్లోకమునందలి మంత్రములు:**

౧. నక్షత్రగ్రహతారాధిపాయ నమః

౨. విశ్వభావనాయ నమః

౩. తేజసామపి తేజస్వినే నమః

౪. ద్వాదశాత్మనే నమః

नमः पूर्वाय गिरये पश्चिमायाद्रये नमः
ज्योतिर्गणानां पतये दिनाधिपतये नमः

నమః పూర్వాయ గిరయే పశ్చిమాయాద్రయే నమః
జ్యోతిర్గణానాం పతయే దినాధిపతయే నమః ౧౬

**ప్రతిపదార్థము:**

పూర్వాయ గిరయే= తూర్పుపర్వతరూపునకు,

నమః= నమస్కారము,

పశ్చిమాయాద్రయే= పశ్చిమ పర్వతరూపునకు,

నమః= నమస్కారము,

జ్యోతిర్గణానాం= జ్యోతిర్గణముల,

పతయే= అధిపతికి,

దినాధిపతయే= దినము యొక్క అధిపతికి,

నమః= నమస్కారము.

**తాత్పర్యము:**

తూర్పు, పశ్చిమ పర్వత స్వరూపుడు, జ్యోతిర్గణముల అధిపతి, ధినాధిపతి అయిన సూర్యభగవానునకు నమస్కారము.

**ఈ శ్లోకమునందలి మంత్రములు:**

౧. పూర్వాయ గిరయే నమః

౨. పశ్చిమాద్రయే నమః

౩. జ్యోతిర్గణానాం పతయే నమః

౪. దినాధిపతయే నమః

जयाय जयभद्राय हर्याश्वाय नमो नमः
नमो नमः सहस्रांशो आदित्याय नमो नमः

జయాయ జయభద్రాయ హర్యశ్వాయ నమో నమః,
నమో నమః సహస్రాంశో ఆదిత్యాయ నమో నమః ౧౭

**ప్రతిపదార్థము:**

జయాయ= జయము కలిగించువానికి,

జయభద్రాయ= భద్రమును ఇచ్చువానికి,

హర్యశ్వాయ= ఆకుపచ్చని గుఱ్ఱములు గలవానికి,

నమః నమః= నమస్కారము నమస్కారము,

సహస్రాంశో= వేయి కిరణములు (అనంత కిరణములు) కలవానికి,

ఆదిత్యాయ= ఆదిత్యునకు,

నమః నమః= నమస్కారము నమస్కారము.

**తాత్పర్యము:**

ఉపాసించువారికి విజయమును, భద్రమును, మంగళమును ఇచ్చువాడు, ఆకుపచ్చని గుఱ్ఱములు గలవాడు, అనంత కిరణములు కలవాడు అయిన అదితి పుత్రుడైన సూర్యదేవునకు నమస్కారము.

**ఈ శ్లోకమునందలి మంత్రములు:**

౧. జయాయ నమః

౨. జయభద్రాయ నమః

౩. హర్యశ్వాయ నమః

౪. సహస్రాంశవే నమః

౫. ఆదిత్యాయ నమః

नम उग्राय वीराय सारङ्गाय नमो नमः
नमः पद्मप्रबोधाय प्रचण्डाय नमोऽस्तु ते

నమ ఉగ్రాయ వీరాయ సారఙ్గాయ నమో నమః,
నమః పద్మప్రబోధాయ ప్రచణ్డాయ నమోఽస్తు తే ౧౮

**ప్రతిపదార్థము:**

ఉగ్రాయ= శత్రువులకు ఉగ్రుడైన,

వీరాయ= ప్రాణులను ప్రేరేపించువానికి,

నమః= నమస్కారము,

సారఙ్గాయ= శీఘ్ర గతిని ప్రయాణము చేయువానికి,

నమః నమః= నమస్కారము నమస్కారము,

పద్మప్రబోధాయ= కమలములను వికసింపజేయువానికి,

నమః= నమస్కారము,

ప్రచణ్డాయ= సహింప సఖ్యముగాని,

తే= నీకు,

నమః= నమస్కారము,

అస్తు= అగుగాక.

**తాత్పర్యము:**

ఉగ్రునకు నమస్కారము. వీరునకు నమస్కారము. శీఘ్రగతిని ప్రయాణించువానికి నమస్కారము, పద్మములను వికసింపజేయువానికి నమస్కారము. తీక్ష్ణుడవైన నీకు నమస్కారము.

**ఈ శ్లోకమునందలి మంత్రములు:**

౧. ఉగ్రాయ నమః

౨. వీరాయ నమః

౩. సారఙ్గాయ నమః

౪. పద్మప్రబోధాయ నమః

౫. ప్రచణ్డాయ నమః

ब्रह्मेशानाच्युतेशाय सूर्यायादित्यवर्चसे
भास्वते सर्वभक्षाय रौद्राय वपुषे नमः

బ్రహ్మేశానాచ్యుతేశాయ సూర్యాయాదిత్యవర్చసే
భాస్వతే సర్వభక్షాయ రౌద్రాయ వపుషే నమః ౧౯

**ప్రతిపదార్థము:**

బ్రహ్మేశానాచ్యుతేశాయ= బ్రహ్మ విష్ణు మహేశ్వర స్వరూపునకు,

సూర్యాయ= సూర్యునకు,

ఆదిత్యవర్చసే= ఆదిత్యరూపమైన కాంతి గలవానికి,

భాస్వతే= భాసించువానికి,

సర్వభక్షాయ= సర్వసంహారకుడైన,

రౌద్రాయ వపుషే= రౌద్ర కాయము కలవానికి,

నమః= నమస్కారము.

**తాత్పర్యము:**

బ్రహ్మ విష్ణు మహేశ్వర స్వరూపునకు, సూర్యునకు, ఆదిత్యరూపమైన వర్చస్సు కలవానికి, కాంతిప్రదాతకి, సర్వసంహారకునకు, రౌద్ర రూపికి నమస్కారము.

**ఈ శ్లోకమునందలి మంత్రములు:**

౧. బ్రహ్మేశానాచ్యుతేశాయ నమః

౨. సూర్యాయ నమః

౩. ఆదిత్యవర్చసే నమః

౪. భాస్వతే నమః

౫. సర్వభక్షాయ నమః

౬. రౌద్రవపుషే నమః

तमोघ्नाय हिमघ्नाय शत्रुघ्नायामितात्मने
कृतघ्नघ्नाय देवाय ज्योतिषां पतये नमः

తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నాయామితాత్మనే
కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాం పతయే నమః ౨౦

**ప్రతిపదార్థము:**

తమోఘ్నాయ= తమస్సును అనగా చీకటిని నశింపజేయువానికి,

హిమఘ్నాయ= హిమమును అనగా మంచును నశింపజేయువానికి,

శత్రఘ్నాయ= శత్రువులను నశింపజేయువానికి,

అమితాత్మనే= కొలుచుటకు శక్యము కాని స్వరూపము కలవానికి,

కృతఘ్నఘ్నాయ= కృతఘ్నులైనవారిని సంహరించువానికి,

దేవాయ= ప్రకాశించువానికి,

జ్యోతిషామ్= జ్యోతిస్సుల,

పతయే= ప్రభువుకి,

నమః= నమస్కారము.

**తాత్పర్యము:**

చీకటిని, మంచును, శత్రువులను, కృతఘ్నులను నశింపజేయువానికి, అమితమైన స్వరూపము కలవానికి, దివ్యమైన ప్రకాశముకలవానికి, జ్యోతిస్సుల అధిపతికి నమస్కారము.

**ఈ శ్లోకమునందలి మంత్రములు:**

౧. తమోఘ్నాయ నమః

౨. హిమఘ్నాయ నమః

౩. శత్రుఘ్నాయ నమః

౪. అమితాత్మనే నమః

౫. కృతఘ్నఘ్నాయ నమః

౬. దేవాయ నమః

౭. జ్యోతిషాం పతయే నమః

तप्तचामीकराभाय हरये विश्वकर्मणे
नमस्तमोभिनिघ्नाय रुचये लोकसाक्षिणे

తప్తచామీకరాభాయ హరయే విశ్వకర్మణే
నమస్తమోభినిఘ్నాయ రుచయే లోకసాక్షిణే ౨౧

**ప్రతిపదార్థము:**

తప్తచామీకరాభాయ= కాల్చిన బంగారము వంటి కాంతి గలవానికి,

హరయే= అజ్ఞానమును హరించువానికి,

విశ్వకర్మణే= విశ్వమును సృష్టించిన వానికి,

తమోభినిఘ్నాయ= చీకటిని తొలగించువానికి,

రుచయే= ప్రకాశరూపునకు,

లోకసాక్షిణే= లోకుల పుణ్యపాపములకు సాక్షియైన వానికి,

నమః= నమస్కారము.

**తాత్పర్యము:**

కాల్చిన కాంచనము వంటి కాంతి గలవానికి, హరునకు, విశ్వకర్తకు, చీకటిని తొలగించు ప్రకాశస్వరూపునకు, లోకమునకు సాక్షి అయినవానికి నమస్కారము.

**ఈ శ్లోకమునందలి మంత్రములు:**

౧. తప్తచామీకరాభాయ నమః

౨. హరయే నమః

౩. విశ్వకర్మణే నమః

౪. తమోభినిఘ్నాయ నమః

౫. రుచయే నమః

౬. లోకసాక్షిణే నమః

नाशयत्येष वै भूतं तदेव सृजति प्रभुः
पायत्येष तपत्येष वर्षत्येष गभस्तिभिः

నాశయత్యేష వై భూతం తదేవ సృజతి ప్రభుః
పాయత్యేష తపత్యేష వర్షత్యేష గభస్తిభిః ౨౨

**ప్రతిపదార్థము:**

ప్రభుః= సర్వులకు ప్రభువైన,

ఏషః వై= ఈ సూర్యుడే,

భూతమ్= జగత్తును,

నాశయతి= నశింపజేయును,

తదేవ= దానినే,

సృజతి= సృష్టిచేయును,

ఏషః= ఇతడు (ఈ సూర్యుడు),

గభస్తిభిః= కిరణముల చేత,

పాయతి= శుష్కింపజేయును,

ఏషః= ఇతడు,

తపతి= తపింపజేయును,

ఏషః= ఇతడు,

వర్షతి= వర్షించును.

**తాత్పర్యము:**

జగన్నాథుడైన ఈ సూర్యభగవానుడే జగత్తును ప్రళయకాలమునందు నశింపజేసి మరల దానినే సృజించును, సూర్యకిరణముల చేత ఈ

లోకమును శుష్కింపజేయును, భువనములకు తాపమును కలుగజేయును, జగత్తునందు వర్షించును.

**ఈ శ్లోకమునందలి మంత్రములు:**

౧. భూతనాశాయ నమః

౨. భూతస్రష్ట్రే నమః

౩. ప్రభవే నమః

౪. పాయతే నమః

౫. తపతే నమః

౬. వర్షతే నమః

एष सुप्तेषु जागर्ति भूतेषु परिनिष्ठितः
एष चैवाग्निहोत्रं च फलं चैवाग्निहोत्रिणाम्

ఏష సుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః
ఏష చైవాగ్నిహోత్రం చ ఫలం చైవాగ్నిహోత్రిణామ్ ౨౩

**ప్రతిపదార్థము:**

ఏషః= ఇతడు,

భూతేషు= ప్రాణులు,

సుప్తేషు= నిద్రించుచుండగా,

పరినిష్ఠితః= వాటిలో ఉన్నవాడై,

జాగర్తి= మెలకువగా ఉండును.

ఏషః చైవ= ఇతడే,

అగ్నిహోత్రం చ= అగ్నిహోత్రము,

అగ్నిహోత్రిణామ్= అగ్నిహోత్రము చేయువారియొక్క,

ఫలం చ= ఫలము కూడా.

**తాత్పర్యము:**

సకలప్రాణులూ నిద్రించుచుండాగా సూర్యభగవానుడు వాటిలో అంతరాత్మరూపమున మేల్కొని ఉండును. అతడే అగ్నిహోత్రము, అగ్నిహోత్రము చేయువారికి ఫలమునిచ్చువాడును కూడా.

**ఈ శ్లోకమునందలి మంత్రములు:**

౧. సుప్తేషు జాగ్రతే నమః

౨. భూతేషు పరినిష్ఠితాయ నమః

౩. అగ్నిహోత్రాయ నమః

౪. అగ్నిహోత్రఫలప్రదాయ నమః

देवाश्च क्रतवश्चैव क्रतूनां फलमेव च
यानि कृत्यानि लोकेषु सर्वेषु परमप्रभुः

దేవాశ్చ క్రతవశ్చైవ క్రతూనాం ఫలమేవ చ
యాని కృత్యాని లోకేషు సర్వేషు పరమప్రభుః ౨౪

**ప్రతిపదార్ధము:**

దేవాః= దేవతలు,

క్రతవశ్చైవ= క్రతువులు,

క్రతూనామ్= క్రతువుల యొక్క,

ఫలమేవ చ= ఫలము,

సర్వేషు= సమస్తమైన,

లోకేషు= లోకములయందు,

యాని= ఏ,

కృత్యాని= కృత్యములు గలవో,

పరమప్రభుః= మిక్కిలి సమర్థుడు.

**తాత్పర్యము:**

దేవతలు, యజ్ఞములు, యజ్ఞ ఫలములు కూడా సూర్యుడే. లోకములో ఉన్న సమస్త కృత్యముల విషయములనందు మిక్కిలి సమర్థుడు సూర్యభగవానుడే.

एनमापत्सु कृच्छ्रेषु कान्तारेषु भयेषु च
कीर्तयन् पुरुषः कश्चिन्नावसीदति राघव

ఏనమాపత్సు కృచ్ఛ్రేషు కాన్తారేషు భయేషు చ
కీర్తయన్ పురుషః కశ్చిన్నావసీదతి రాఘవ ౨౫

**ప్రతిపదార్థము:**

రాఘవ= రామా,

ఏనమ్= ఈ సూర్యుణ్ణి,

ఆపత్సు= ఆపదలయందు,

కృచ్ఛ్రేషు= కష్టములలోను,

కాన్తారేషు= కఠినమార్గములయందు,

భయేషు= భయమునందు,

కీర్తయన్= కీర్తించుచున్న,

పురుషః= మానవుడు,

కశ్చిత్= ఎవ్వడునూ,

నావసీదతి= నశించడు.

**తాత్పర్యము:**

ఓ రామా! ఆపదలలోను, కఠినమార్గములలోను, భయసమయములలోను ఈ సూర్యుణ్ణి కీర్తించు ఏ మానవుడూ నశించడు.

पूजयस्वैनमेकाग्रो देवदेवं जगत्पतिम्
एतत्त्रिगुणितं जप्त्वा युद्धेषु विजयिष्यसि

పూజయస్వైనమేకాగ్రో దేవదేవం జగత్పతిమ్
ఏతత్త్రిగుణితం జప్త్వా యుద్ధేషు విజయిష్యసి ౨౬

**ప్రతిపదార్థము:**

జగత్పతిమ్= జగన్నాథుడు,

దేవదేవమ్= దేవేశ్వరేశ్వరుడు అయిన,

ఏనమ్= ఈ సూర్యుణ్ణి,

ఏకాగ్రః= ఏకాగ్రచిత్తము కలవాడవై,

పూజయస్వ= పూజింపుము,

ఏతత్= దీనిని,

త్రిగుణితమ్= మూడు పర్యాయములు,

జప్త్వా= జపించి,

యుద్ధేషు= రణములయందు,

విజయిష్యసి= జయించగలవు.

**తాత్పర్యము:**

జగన్నాథుడు, దేవేశ్వరేశ్వరుడు అయిన ఈ సూర్యభగవానుని ఏకాగ్రచిత్తముతో పూజింపుము. ఈ ఆదిత్యహృదయమును మూడు పర్యాయములు జపించినచో యుద్ధములలో విజయము పొందగలవు.

अस्मिन् क्षणे महाबाहो रावणं त्वं वधिष्यसि
एवमुक्त्वा ततोऽगस्त्यो जगाम स यथागतम्

అస్మిన్ క్షణే మహాబాహో రావణం త్వం వధిష్యసి
ఏవముక్త్వా తతోఽగస్త్యో జగామ స యథాగతమ్ ౨౭

**ప్రతిపదార్థము:**

మహాబాహో= గొప్పవైన బాహువులు కలవాడా,

అస్మిన్= ఈ,

క్షణే= క్షణమునందు,

త్వమ్= నీవు,

రావణమ్= రావణుణ్ణి,

వధిష్యసి= చంపగలవు,

అగస్త్యః= అగస్త్యుడు,

ఏవమ్= ఇట్లు,

ఉక్త్వా= పలికి,

తతః= అటుపిమ్మట,

యథాగతమ్= వచ్చిన విధముగనే,

జగామ= వెడలిపోయెను.

**తాత్పర్యము:**

గొప్పవైన బాహువులు కల ఓ రామా! నీవు ఈ క్షణమునందే రావణుణ్ణి చంపగలవు అని అగస్త్యుడు ఆశీర్వచనము పలికి వచ్చిన విధముగనే వెడలిపోయెను.

एतच्छ्रुत्वा महातेजा नष्टशोकोऽभवत्तदा
धारयामास सुप्रीतो राघवः प्रयतात्मवान्

ఏతచ్ఛ్రుత్వా మహాతేజా నష్టశోకోఽభవత్తదా
ధారయామాస సుప్రీతో రాఘవః ప్రయతాత్మవాన్ ౨౮

**ప్రతిపదార్థము:**

తదా= అప్పుడు,

మహాతేజాః= మహాతేజోవంతుడగు రాముడు,

ఏతత్= దీనిని,

శ్రుత్వా= విని,

నష్టశోకః= శోకము నశించినవాడు,

అభవత్= అయ్యెను,

రాఘవః= రాముడు,

సుప్రీతః= చాలా సంతోషించినవాడై,

ప్రయతాత్మవాన్= నిశ్చలమైన మనముకలవాడై,

ధారయామాసః= ధరించెను.

**తాత్పర్యము:**

మహాతేజశ్శాలియైన శ్రీరాముడు అగస్త్యమహర్షి అనుగ్రహించిన ఆదిత్యహృదయమును విని శోకమును విడిచిపెట్టెను. నిశ్చలమైన మనస్సుతో, సంతోషముతో శ్రీరాముడా మంత్రమును ధరించెను.

आदित्यं प्रेक्ष्य जप्त्वा तु परं हर्षमवाप्तवान्
त्रिराचम्य शुचिर्भूत्वा धनुरादाय वीर्यवान्

रावणं प्रेक्ष्य हृष्टात्मा युद्धार्थं समुपागमत्
सर्वयत्नेन महता वधे तस्य धृतोऽभवत्

ఆదిత్యం ప్రేక్ష్య జప్త్వా తు పరం హర్షమవాప్తవాన్
త్రిరాచమ్య శుచిర్భూత్వా ధనురాదాయ వీర్యవాన్ ౨౯

రావణం ప్రేక్ష్య హృష్టాత్మా యుద్ధార్థం సముపాగమత్
సర్వయత్నేన మహతా వధే తస్య ధృతోఽభవత్ ౩౦

**ప్రతిపదార్థము:**

వీర్యవాన్= పరాక్రమశాలియైన శ్రీరాముడు,

ఆదిత్యమ్= సూర్యుణ్ణి,

ప్రేక్ష్య= చూచి,

త్రిః= మూడు పర్యాయములు,

ఆచమ్య= ఆచమనముజేసి,

శుచిః= పవిత్రుడు,

భూత్వా= అయి,

జప్త్వా= జపించి,

పరమ్= గొప్ప,

హర్షమ్= సంతోషమును,

అవాప్తవాన్= పొందెను,

ధనుః= ధనస్సును,

ఆదాయ= గ్రహించి,

రావణమ్= రావణుని,

ప్రేక్ష్య= చూచి,

హృష్టాత్మా= ముదమునందిన మనస్సు  గలవాడై,

యుద్ధార్థమ్= యుద్ధము కొరకు,

సముపాగమత్= వచ్చెను,

మహతా= గొప్పదైన,

సర్వయత్నేన= సకల యత్నముల చేత,

తస్య= వానియొక్క,

వధే= వధ యందు,

ధృతః= స్థిరచిత్తుడు,

అభవత్= అయ్యెను.

**తాత్పర్యము:**

పరాక్రమశాలియైన ఆ శ్రీరాముడు మూడు పర్యాయములు ఆచమనమాచరించి పవిత్రుడై, సూర్యభగవానుని చూచి, ఆదిత్యహృదయమును జపించి, గొప్పదైన సంతోషమును పొందెను. ఆపై ధనస్సు గ్రహించి, రావణుని చూచి సంతోషించిన మనముకలవాడై రణమునకు వచ్చెను. సకల ప్రయత్నములచేత ఆ దానవేశ్వరుని వధించుటకు నిశ్చయించుకొనెను.

अथ रविरवदन्निरीक्ष्य रामं
मुदितमनाः परमं प्रहृष्यमाणः
निशिचरपतिसंक्षयं विदित्वा
सुरगणमध्यगतो वचस्त्वरेति

అథ రవిరవదన్నిరీక్ష్య రామం
ముదితమనాః పరమం ప్రహృష్యమాణః
నిశిచరపతిసంక్షయం విదిత్వా
సురగణమధ్యగతో వచస్త్వరేతి ౩౧

**ప్రతిపదార్థము:**

అథ= పిమ్మట,

ముదితమనాః= ముదమునందిన మనస్సుగల,

రవిః= సూర్యుడు,

పరమ్= మిక్కిలి,

ప్రహృష్యమాణః= రోమాంచిత శరీరుడై,

రామమ్= రాముణ్ణి,

నిరీక్ష్య= చూచి,

నిశిచరపతిసంక్షయమ్= ఆ దానవేశ్వరుని మరణమును,

విదిత్వా= తెలిసికొని,

సురగణమధ్యగతః= దేవతాగణ మధ్యముడై,

త్వర= త్వరపడుము,

ఇతి= అని,

వచః= వచనమును,

అవదత్= పలికెను.

**తాత్పర్యము:**

శ్రీరామచంద్రుడు ఆదిత్యహృదయమును పఠించిన పిమ్మట సంతోషించిన సూర్యభగవానుడు రోమాంచితమైన శరీరముతో దేవతాగణ మధ్యమున నిలచి, శ్రీరాముని జూచి, రావణుడు మరణించునట్లు అనుగ్రహించి "త్వరపడుము" అని పలికెను.

★★★

శ్రీరామచన్ద్రపరబ్రహ్మణే నమః



